వాల్చకుండా చూసింది. తన కొడు కల్లాంటి పెద్దపని చెయ్యాలని నిశ్చయించుకుంది.

రానురాను ఆమెకు 'సోషలిస్టు' అనే మాట పరిచితమైపోయింది ఆమాట అంటే భయమే పోయింది. కాని ఏమోకాని 'శశాంక' అంటే మాత్రం ఆమె కేదో ఒక విధమైన భయం కలిగేది.

ఒకరోజున తల్లి ఆంద్రీ నఖోడాతో మాటాడుతూ శశాంక ప్రస్తావం వచ్చి 'ఏమిటా పిల్ల ధోరణి? ఎప్పుడూ చిర్రు బుర్రుమంటూ, ఎవళ్ళ మీదో ఒకళ్ళమీద అధికారం చలాయిస్తూనే ఉంటుంది' అంది.

నఖోడా ఫక్కున నవ్వేడు.

'మా బాగా చెప్పేవుకదూ? పావెల్ మీద మా మంచి ఫిర్యాదు! అతనికి కోపంవస్తుంది సుమా!' అని వేళాకోళం ఆరంభించాడు.

పావెల్ తెల్లబోయి ఆమె చాలా మంచిది అన్నాడు.

'నిజమే. కాని ఆమె కొక్క సంగతిమాత్రం.........' అని నఖోడా చెప్పబోయాడు. ఇద్దరూ చర్చలోకి దిగేరు తల్లికేమీ యీ గొడవ తెలియ లేదు. 'శశాంక' పావెల్‌తోకూడా చిర్రుబుర్రులాడడం తల్లి చూసింది. అప్పుడప్పుడు శశాంక పావెల్‌ను గట్టిగా చీవాట్లు పెట్టుతూండేది కూడా. కాని పావెల్ మాత్రం అతి ఓర్మితో, చిరునవ్వునవ్వుతూ, ఎంతో దయతో ఆమె నాదరించేవాడు. నటాషాతో పోల్చిచూస్తే తల్లికి శశాంక యెడల ఒక విధమైన అయిష్టం ఏర్పడింది.

*  *  *  *

సభలు జోరయినాయి. వారాని కొక సభల్లా రెండు సభలైనాయి. ప్రతి సమావేశంలోనూ పావెల్, నఖోడా, శశాంక, నటాషా వగైరాలంతా చెప్పేమాటలు వింటూంటే తల్లికి క్రమంగా భయం వదలిపోయింది. అప్పు డప్పు డీ సమావేశాలలో సంగీతంకూడా ఉండేది. చక్కని పాటలను [illegible]మని పాడుతూఉండేవారు. ఒకప్పుడు అతిదీనంగానూ, మరొక్కప్పుడు

భక్తిపూరితంగానూ ఉండేవి పాటలు. ఆ పాటలు పాడేటప్పుడు వాళ్ళ ముఖంలో మహత్తరమైన తేజస్సూ, శక్తీ నృత్యంచేస్తూ ఉండేవి. ఆ పాటలను వీధుల్లోపాడే రోజులొచ్చాయని వాళ్ళల్లో వాళ్ళు అనుకుంటూ ఉండేవారు.

ఒక్కొక్కరోజున ఎప్పుడైనా వార్తాపత్రికలవల్ల, ఇతర దేశాల్లో కూలినాలిజనానికి ఏదైనా సౌకర్యం కలిగినట్లు తెలిస్తే, ఆ రోజున అంతా సంతోషంచేత ఉబ్బి తబ్బిబ్బయిపోయేవారు.

'మన ఫ్రెంచి సోదరులు మహా గట్టివాళ్ళు' అనేవా డొకడు. 'ఇటలీ పనివాళ్ళు మరీ ఉద్దండపిండాలు' అని ఇంకొకడు. వాళ్ళపేర జయజయధ్వానాలు చేసేవాళ్లు. ఆ దేశాల్లోఉండే పనివాళ్ళను వీళ్ళెప్పుడూ చూడకపోయినా, ఆఖరికి వాళ్ళభాష ఒక్క అక్షరమైనా తెలియకపోయినా వాళ్ళయెడల అదొకవిధమైన ఐక్యభావం, సానుభూతి కలిగేది. అన్ని దేశాల్లోని కూలీలు తమ యెదుటఉన్నట్లే సంతోషించేవాళ్లు. ఒకసారి అలాంటి సందర్భంలో నకోడా ఇట్లా ఉపన్యసించాడు:

'సోదరులారా! మనం వాళ్ళకొక సందేశం పంపితే బాగుంటుంది. తమకు చాలా దూరానఉన్న రష్యాలోకూడా తమ మతమును, ఆదర్శమును కూడా విశ్వసించి, అందులకై కష్టపడే కార్మికులున్నారనీ, తమ విజయానికి వాళ్లుకూడా సంతోషిస్తున్నారనీ, వాళ్ళకి తెలియడం చాలా అవసరం.'

మిగిలినవారంతా భేష్ అంటే భేష్ అన్నారు.

ఈరీతిగా జర్మనీ, స్వీడెన్, బ్రిటను, ఇటలీ మొదలైన దేశాల్లో ఉండే పాటకప్రజనం యెడల అపారమైన సానుభూతి, సోదరభావం కనపరుస్తూ ఉండేవాళ్ళు. వాళ్ళందరి కష్టాలు తమ కష్టాలుగా భావించి చర్చలు చేస్తూ వుండేవారు. పావెల్ చిన్నగదిలో, ఈదేశం ఆ దేశం అనే భేదం లేకుండా విశ్వకార్మిక సౌభ్రాతృత్వం కూలినాలిజనాల్లో పుట్టింది. తమ శక్తిసామర్థ్యాలు ఎంతవరకున్నాయో తెలిసింది. అప్పుడే కొన్ని దేశాల్లో పాటకప్రజనం పాలనాధికారం పొందటంచూచి, మానవజీవితాన్ని భావికాలంలో పరిపాలించవలసినది తామే సనే ధీమా కలిగింది.

ఈ భావాలపరిణామం, వైశాల్యంచూచి తల్లి తబ్బిబ్బయ్యేది. ఆమెకు దాని అంతర్యం అర్థంకాలేదు. కాని ఇదంతా చూస్తూంటే ఆమెలో ఒక నూతనమైన ధైర్యం, సాహసం, సంతోషం మాత్రం కలిగేయి.

'మీరు మహా చిత్రమైన మనుష్యుల్లా ఉన్నారే. అక్కినియా లోనూ, ఆస్ట్రియాలోను మరి ఇంకా ఎక్కడెక్కడో ఉన్నవాళ్ళంతా మీ సోదరులేనంటారే! ఈ దేశాల్లో పాటకప్రజనం అంతా మీకు మిత్రులా? వాళ్ళ కష్టాలకోసం మీ రెందు కింత ఆత్రుతపడడం? వాళ్లుసుఖపడుతుంటే ఆనందించదానికి మీకేముంది?' అంటూ తల్లి ఒకరోజున నకోదాను అడిగింది.

'తల్లీ! అలాకాదు. అంతా ఒకటే. ఈ ప్రపంచం మనది. అంటే కష్టపడి జీవనంచేసే కూలినాలిజనానిదే. మన కొక జాతి, దేశం, మతం అనే నియమం, నిషేధంలేదు. మనకంతాసోదరులే. మనతో చేరనివాళ్లంతా మనదేశ శత్రువులే. సోదరులు, శత్రువులు తప్ప మరొకరులేరు మనకి. ప్రపంచంలో కాయకష్టంచేసి బ్రతికేవాళ్ళంతా మనసోదరులు. ధనికులు, వాళ్ళకు తోడుగాఉండే అధికారులు మన శత్రువులు. నిజంగా మన పని వాళ్లయొక్క సంఖ్యాధిక్యం తలుచుకున్నా, మనకున్న అపారమైన శక్తిని తలుచుకున్నా హృదయం ఉప్పొంగుతుంది. ఆ సంగతి జ్ఞాపకంచేసుకున్న ప్పుడల్లా శలవొచ్చినంత సంతోషం వస్తుంది. మనలాగే ఫ్రాన్సు, జర్మనీ, ఆస్ట్రియా మొదలైన దేశాలలో ఉండే పనివాళ్ళుకూడా తలుచుకొని సంతో షిస్తారు. మనమంతా ఒక తల్లి బిడ్డలం. ప్రపంచంలో అన్ని దేశాల్లో ఉండే పనివాళ్లంతా ఒక తల్లి బిడ్డలే. ఈ భావం చాలా అద్భుతమైనది. ఓహో! ఈమాట తలుచుకుంటే మహా ఆనందం. ఈభావం రోజురోజూ పెరుగు తోంది. ఇంతెందుకు? ఒక్కమాట చెపుతాను విను. ప్రపంచంలో ఎవరైనా సరే, సోషలిష్టంటే చాలు. అతడు ముమ్మాటికీ, ఇప్పటికీ ఎప్పటికీకూడ మన సోదరుడే' అంటూ నకోడా దీర్ఘమైన ఉపన్యాస మిచ్చాడు. ఈ కబుర్లన్నీ ఆలకించేటప్పటికి ఆమెకు అమాయకమైన ఆనందం కలిగింది.

ప్రతి రోజూ ఇంటి కొచ్చేటప్పుడు పావెల్ ఎవరినో ఒక మిత్రుని వెంటపెట్టుకొచ్చేవాడు. ఇద్దరూ కలిసి ఏమిటో చదువుతూ ఉండేవారు. అప్పుడప్పు డేమో వ్రాస్తూఉండేవారు. స్నానంచేసి విశ్రాంతిగా భోజనం

చెయ్యడానికైనా తీరిక ఉండేదిగాదు. పుస్తకాలు చేతుల్లో ఉంచుకొనే భోజనం చేసేవారు. ఈ తెరిపిలేని పనేమిటో తల్లికి అర్థమేకాలేదు. అప్పుడప్పుడు పావెల్ 'మన సొంత పత్రిక పెట్టాలి' అంటూ ఉండేవాడు.

*　　*　　*　　*

మొత్తంమీద బ్రతుకు ఒడుదుడుకుల్లో పడింది. ఏమిటో ఒకమాదిరి హడావుడిగా వుండేది. ఒకనాడు వెసోవికషి నకోడాతో 'ఏమన్నాయ్! వాళ్లు మనగొడవే చెప్పుకుంటున్నారు. మన మిక్కడనుంచి మకాం ఎత్తాలి' అన్నాడు—

'ఎందుకూ? ఈ పక్షి లెప్పుడో ఒకప్పుడు వల్లోపడేవే'—అన్నాడు నకోడా.

*　　*　　*　　*

ఏ కారణంచేతనో కాని మొదటినుంచీ తల్లికి ఆంద్రీ నకోడా అంటే ఒకవిధమైన ప్రేమ, అభిమానం. అతడు 'అమ్మా' అని పిలిచినపుడల్లా ఆమె పరవశమైపోయేది. నకోడా ఆమెకు గృహకృత్యంలోకూడా కొంత సాయపడుతూ ఉండేవాడు. ఏ ఆదివారంనాడైనా పావెల్ ఊళ్ళో లేకపోతే పుల్లా గట్రా కొట్టి అందిచ్చేవాడు. ఇంటి గుమ్మం పాడైపోతే ఒకనాడు అతడే స్వయంగా బాగుచేశాడు. ఈ పనులవల్లకూడా అతడు తల్లి ప్రేమకు పాత్రుడవుతూ వచ్చాడు.

ఇలా ఉండగా ఒకరోజున పావెల్‌కూ తల్లికీ యీ క్రింది సంభాషణ జరిగింది.

'నాయనా! నకోడాకూడా మనింటిలోనే మనతోపాటే భోజనం చేస్తూవుంటే బాగుంటుందనుకుంటూను. మీరిద్దరు రోజంతా ఒకచోట కలసి వుండొచ్చు. మీ సంపాదన కలుపుకుంటే ఖర్చు కలిసివస్తుంది కూడాను.'

'అవును. కాని, నీకు శ్రమ కాదూ?'

'శ్రమ కేమిలే. నా బ్రతుకంతా శ్రమే. నాకు బాధ ఎలాగూ తప్పదు. కాని, ఇలాంటి మంచిమనిషికోసం ఎంతబాధైనా పడొచ్చు.'

'అయితే నీ యిష్టం. అతడంగీకరిస్తే నాకూ సంతోషమే.'

కొద్దిరోజులకి నహోడ్కా పావెల్ ఇంట్లోనే కాపురం పెట్టాడు.

౫

ఊరిచివరనున్న పావెల్ కొంపమీద అధికారులదృష్టి పడింది. రకరకాలుగా పుకార్లు బయలుదేరినాయి. అధికారులకే కాదు, జనానికికూడా ఆ యింట్లో ఏమిజరుగుతుందో చూడాలనే నిగ్రహించరాని మైన ఆదుర్దా కలిగి తొంగిచూస్తూ వుండేవారు. ఇక పోలీసు గూఢచారుల సంగతి వేరే చెప్పనక్కరలేదు.

ఒకరోజున నిలోవ్నా బజారులో పోతూవుంటే సారాదుకాణంవాడు ఆపుచేసేడు.

'ఏమిటమ్మా నిలోవ్నా! నీ కొడుకింకా పెళ్ళిప్రయత్నం చెయ్యడ వేమిటి? ఇల్లాంటి కుర్రాళ్ళను ఊరికే అచ్చోసి వదిలెయ్యకూడదు. ఎంత త్వరగా పెళ్ళిచేస్తే అంతమంచిది. పెళ్ళి చేసినారంటే సంసారం పడి నెమ్మదిగా పడుంటాడు. రోజులు మునుపట్లా లేవు. మనిషినికూడా గొడ్డును కని పెట్టాలిసినట్లు కనిపెట్టేరోజులు వచ్చాయి. రహస్యపుటాలోచనలు బయలుదేరాయి. ఈ విపరీతం ఏమిటీ? యౌవనంలోవుండే కుర్రాళ్ళంతా తాగడం మానేసేరు. సారాదుకాణాలను బహిష్కరించి, రహస్యప్రదేశాలల్లో గుసగుసలాడుతున్నారు. అంత రహస్య మేమి టంట? బాగా ఆలోచించుకో. నీవున్న స్థితిలో నేనుంటే ఈపాటికి కుర్రాడికి ఏదో పిల్లను చూసి ముడి పెట్టేవాడినే. నీ ఆరోగ్యం బాగుందికదా?' అంటూ సలహాయిచ్చి వెళ్ళి పోయాడు.

నిలోవ్నా ఇంటిప్రక్కనే 'మేరీకార్సునోవా' అనే కమ్మరివాని విధవ ఒకామె కాపురముంది. ఆమె ఫ్యాక్టరీలో ఫలహారములు అమ్ముకొని జీవించేది. ఒకనాడామె రహస్యంగా పావెలింటికి వచ్చి, తల్లిని పిలిచి 'ఇదిగో నీ కొడుకు జాగ్రత్త!' అంది.

'అసలు సంగతేమిటి?'

'మరేమీలేదు. అతగాడిమీద చాలా చాలా పుకార్లు బయలుదేరి నాయి. జాగ్రత్త! అత డేదో సంఘం ఏర్పాటుచేస్తున్నాడుటకాదూ? మరి నాకు తెలిసింది కనుక చెపుతున్నాను' అని చెవులోవూది చక్కాపోయింది.

తల్లి ఈ మాటలన్నింటికీ ఊకొట్టేది. ఎప్పటికప్పుడు కొడుకుతో మాత్రం చెప్పేది. పావెల్, నకోడాలు ఆమాటలన్నీ విని నవ్వుకునేవారు. ఒకనాడు నకోడా, పావెల్, తల్లి ముగ్గురూ ఇలాకబుర్లుచెప్పుకుంటున్నారు.

తల్లి:—నాయనా! ఇక్కడి పడుచుపిల్లలకు మీమీద చాలా కోపంగా వుంది.

పావెల్:—ఎందుకూ?

తల్లి:—ఎందుకా? వాళ్లు మిమ్మల్ని ప్రేమదృష్టితో చూస్తున్నారు. కాని మీరు వాళ్ళకేసి బొత్తిగా చూడటంలేదట. మీరు కష్టపడి పనిచేసి నాలుగాళ్లు సంపాదిస్తున్నారు. తాగి తందనాలుతొక్కి ఆ నాలుగు రాళ్లు పాడుచేసుకోవడంలేదు. అందుచ్చేత మీరు వాళ్ళకి తగిన భర్త లవుతారని వాళ్ళ ఆశ. కాని మీరు మాట్టాడరాయె. అదీకాకుండా మీదగ్గరకొచ్చేఆడవాళ్ళశీలంఅనుమానాస్పదమనిఅనుకుంటున్నారు.

పా:—అయితే?

నకోడా:—నవ్వుతూ అమ్మా! లోకం అంతటిదే. అంధకారంలోవుంటే అనుమానమే. పెళ్ళో పెళ్ళో యని వుబలాటపడే ఆ పిల్లలకు పెళ్ళి అంటే ఏమిటో నువ్వు కాస్త చెప్పలేకపోయావా? పెళ్ళంటే ఎముకలు విరగేటట్లు మొగుడిచ్చేత దెబ్బలు తినడమేకాదూ? ఆ పెళ్ళికోసం దిగులుపడొద్దని చెప్పు.

త:—అయ్యో! వాళ్ళకిమాత్రం ఆ సంగతి తెలియదూ? తెలుసును. ఆ బాధలన్నీ ఎరుగుదురు. కాని ఏంచేస్తారు? వేరే మార్గంలేదు.

పా:—అదేమన్నమాట! వేరే మార్గంలేకేమి, కొత్తపంథాలో ఆలోచిస్తేసరి.

న:—పోనీ, వాళ్ళలో కొందరి నిక్కడికి పిలిచి మనం బోధిస్తే బాగుం టుందేమో అనుకుంటాను.

పా:—అబ్బే! అంతటితో సరిపోదు.

న:—ప్రయత్నం చెయ్యకూడదూ?

పావెల్ కాస్సేపు కండ్లుమూసుకొని ఆలోచించి 'ఏముంది! జంట తేర్పడతాయి. ఖులాసాగా కలిసి తిరుగుతారు. పెళ్ళిళ్ళు చేసుకుంటారు; అంతే.' తల్లి తన కొడుకు చెప్పిన మాటలను మనసులో వుంచుకొని ఆలోచించుకోవడం ఆరంభించింది. పావెల్ అభిప్రాయాలంటే అందరూ గౌరవిస్తారు. పెద్దవాళ్ళుకూడా అతన్నే అనుసరిస్తారు. కాని అతను ముక్కుకి సూటిగానడిచే మనిషి. అంచేత అతనిమీద కొందరికి కష్టంగా వుంటుం దేమో ననుకుంది తల్లి.

ఒకరోజున వంటఇంట్లో తల్లి పడుకుంది. ప్రక్కగదిలో పావెల్ నకోడా లిద్దరూ కూచుని ఏదో చదువుకుంటున్నారు. ఆ సందర్భంలో వాళ్ళు మెల్లగా మాటాడుకునే యీ మాటలు ఆమె చెవిలో పడ్డాయి.

నకోడా:—నాకు నటాషా అంటే ఇష్టం అనే సంగతి నీకు తెలుసునను కుంటాను.

పా:—ఆ! తెలుసును.

న:—అవును. అటూ ఇటూ పచారుచేస్తూ అయితే ఆమె కీ సంగతి తెలుసునంటావా! నీ అభిప్రాయ మేమిటి?

పా:—తెలు సనుకుంటాను. అందుచ్చేతనే ఆమె మన సమాజానికి రావడం మానుకుంది.

న:—మొగమాటం విడిచి ఆమెతో వున్న సంగతంతా నేను చెపితే......

పా:—ఏమని?

న:—ఏమనా? యిల్లా నీమీద నాకు............

పా:—ఎందుకూ చెప్పడం?

న :—ఎందుకంటావా? చూడు. నా అభిప్రాయం ఏమిటంటే ఒక యువకుడు ఒక యువతిని ప్రేమిస్తే ఆ సంగతి ఆమెకు చెప్పాలని. లేకపోతే దానిలో అర్థంలేదు. "పావెల్ చేతిలో తెరచియున్న పుస్తకాన్ని చటాలున మూసివేశాడు. కొంచెంసేపు ఇద్దరూ మౌనముద్ర వహించారు."

న :—సరి. మరేమిటి?

పా:—* ఆంద్రీ! నీ యభిప్రాయ మేమిటో స్పష్టంగా తెలియడంలేదు. నువ్వు యేమిచేయదలచుకున్నావో స్పష్టంగా చెప్పు. ఆమెకు నీమీద ప్రేమ లేదనే నా వుద్దేశ్యం. ఒకవేళ మాటవరుసకి వుందనుకుందాము. సరే, మీరిద్దరు పెళ్ళి చేసుకుంటారు. కాని ఏమి సంబంధము? అతకదు. చాకలత్త—మంగలిమామ. ఆమె మంచి బుద్ధిశాలి. శాస్త్రవేత్త. నువ్వు కూలి చేసుకుని బ్రతికే మోటు మనిషివి. ఈ అస్వాభావికమైన సంబంధంవలన సంతానం బయలుదేరుతుందనుకో. ఆ పిల్లల సంరక్షణకోసం నీ వొక్కడవే తంటాలు పడాలి. నీపొట్టపోసికొని, పిల్లలను పోషించి, వాళ్ళ సౌకర్యాలకోసం యాతనపడటంతో నీ బ్రతుకు తెల్లవారుతుంది. మనం పూనుకున్న మహత్కార్యానికి నువ్వూ ఆమేకూడా ఎందుకూ పనికిరారు. కనుక ఈ ప్రయత్నం మానుకో. ఆమెను బాధపెట్టకు. ఇది మర్యాదైన పని.

న:—♦ అలెగ్జి ఇవానిచ్ ఈ సందర్భంలో ఏమి చెప్పాడో తెలుసునా? మనిషి నాలుగు విధాలా సంపూర్ణమైన జీవితాన్ని అనుభవించాలని చెప్పేడు. జ్ఞాపకం లేదూ?

పా:—అవును. జ్ఞాపకముంది. అది మనకోసం చెప్పినది కాదు. నీకు పూర్తిగా జీవితాన్ని అనుభవించడానికి సావకాశ మెక్కడుంది? శాశ్వతంగా ముందు రాబొయ్యే తరాలవారికి సౌఖ్యం కలుగ చెయ్యాలంటే ప్రస్తుతం నువ్వు సంపూర్ణమైన త్యాగంచెయ్యాలి.

---

*నకోడా పూర్తిపేరు ఆంద్రిడినకోడా. పావెల్ ఆంద్రిఅనిపిలవడంఅలవాటు.

♦ పావెల్ మిత్రబృందంలో ఒకడు. చాలా అనుభవశాలి.

న:—మెల్లగా మానవమాత్రుడికి కష్టమైనమాట.

పా:—అవును. కాని తప్పనిసరి. వేరేమార్గం ఏముంది. ఆలోచించు.

న:—........హృదయంలో సగభాగం ప్రేమిస్తోంది. సగభాగం వద్దంటోంది. ఏమి హృదయం యిది?

ఈ సంభాషణ వింటూంటే తల్లికి పాపం నళోదామీద జాలివేసింది. అంతేకాకుండా తన కొడుకు గతేమిటో అని దుఃఖమూ కలిగింది.

న :—సరి. అయితే ఇంతకూ నన్ను మాట్లాడకూడదంటూంటావు అంటావా?

పా :—నళోదా! అదే మంచిపని.

న :—సరే. నువ్వుచెప్పినట్లే చేద్దాం. కాని.........కాని........................ఇలాంటి అవస్థ నీకు సంభవించినప్పుడు నీకుకూడా చాలా బాధగానే ఉంటుందిసుమా!

పా:—ఎప్పుడోనా? ఎప్పుడో అక్కరలేదు. ఇప్పుడే నే నంతటి బాధ పడుతున్నాను.

న:—అలాగా?

పా :—అవును.

న :—ఓహో! అబ్బ! చాలకష్టం.

ఈ సంభాషణ విన్న మరునాడు తల్లికి గాభరా యెత్తింది. ఆపైన లేనంత దుఃఖం వచ్చింది. నళోదాకు కలిగిన ఆశాభంగమునకు విచారపడింది. ఇక తన కొడుకుసంగతి తలుచుకుంటే అసలు కడుపు తరుగుకుపోయింది. తలగడ కన్నీటితో తడిసి ముద్దయిపోయింది.

* * * *

గ్రామంలో సామ్యవాదులు నీలపుసిరాతో వ్రాసిన కరపత్రాలు పంచిపెట్టేరు. ఆవేళ ఏమూలకెళ్ళినా ఆ గొడవే. ఈ కరపత్రాలలో వ్యక్తి ...లో జరిగే అన్యాయాలు, రష్యాలో ఇతర ప్రాంతములలో మూలలలో

జరిగిన ప్రబోధము * సెంటు పీటర్సుబర్గులో సమ్మె మొదలైన విషయాలన్నీ విపులంగా వ్రాసివున్నాయి. కూలీల బాగుకోసం అంతా ఏకంకావాలని అందులో హెచ్చరించారు. ఈ కరపత్రాలను చూచి అధికారుల ప్రాపకం సంపాదించి బాగా డబ్బుసంపాదించడం మరిగిన మేస్త్రీలు 'విప్లవకారులు, వెధవలు బయలుదేరారు. పనీపాటాలేక ఏడుస్తున్నారు. ఇల్లాంటివాళ్ళను పట్టుకొని కాళ్ళూ చేతులూ విరగగొట్టాలి' అని తిడుతూవుండేవారు. వాళ్ళే ఆ కరపత్రములను అధికారులదగ్గిరికి తీసుకెళ్లి చూపించేవాళ్ళు.

కష్టపడి పనిచేసి నానాబాధలుపడే యువకులుమాత్రం ఈ కాగితాల కోసం ఎప్పుడూ ఎదురుచూస్తూ వుండేవారు. ఆ కాగితం రావడంతోనే గుంపులు గుంపులుగాచేరి చదువుకొని 'అంతా నిజమే. వూసగుచ్చినట్లుజరిగే దంతా వ్రాసేరు' అంటూ సంతోషించేవారు. మధ్యరకం మనుష్యులు నిస్పృహతో 'బాగా నేసుంది. కాని ఏమిలాభం? పనిజరగదు' అంటూ విసుగుకొనేవారు. మొత్తంమీద ఈ కరపత్రాలుమాత్రం మంచి అలజడి కలిగించేయి. ప్రతి సోమవారం వచ్చే ఈ కాగితా లెప్పుడైనా ఒకవారం రాకపోతే జనం తహతహలాడిపోయేవారు. సారాషాపులోను, ఇతర వినోద స్థలాలలోను క్రొత్తమనుష్యులు కనపడేవారు. వాళ్ళు మనుష్యుల నందరిని తేరిపారజూస్తూ ఉండేవాళ్లు. నాలుగురోజులైన తర్వాత మాయమై పోయేవాళ్ళు.

పావెల్ తల్లికి, ఈ గడబిడకంతా తన కొడుకే మూలమనే సంగతి తెలుసును. పనివాళ్ళంతా అతనిని పూజ్యభావంతో చూడడంచేతా, అతనొక్కడే కాకుండా అతనితోపాటు చాలమంది ఉండడంచేతా మరేమీ ప్రమాదం లేదనుకుంది. పైగా చాలా సంతోషించేది. కొడుకు ప్రయోజకుడై పదిమంది నోళ్ళలో పడితే ఏతల్లి సంతోషించదు? కాని ఈ ప్రయోజకత్వంయొక్క ఫలితం ముం దెట్లా పరిణమిస్తుందా యనే ఆలోచన కలిగినప్పుడుమాత్రం తల్లిగుండె నీరయిపోతూవుండేది. గాభరాపడేది.

ఒకరోజున సాయంత్రం పొరుగింట్లోనున్న 'మేరియా కార్సనోవా' తల్లిని పిలిచి 'ఏమయ్యోయి! నీలోనా! జాగ్రత్త! కొంపముంచుకొస్తోంది.

* సెంటుపీటర్సుబర్గు ఒకప్పుడు రష్యా ముఖ్యపట్టణము ఇప్పు డది 'లెనిన్ గ్రాడ్' అని పిలువబడుచున్నది.

కుర్రవాళ్లు తిన్నగా ఉండరు. ఈవేళ రాత్రి మీయిల్లు, మాజిన్ ఇల్లు సోదా చూడడానికి పోలీసువాళ్లు ఏర్పాటుచేస్తున్నారు. ఈ విషయం నాకు తెలిసింది కనుక ముందుగా చెప్పేను. కాని నే చెప్పినట్లు ఎవరికీ కూడా తెలియకూడదుసుమా. నా కొంప మునుగుతుంది. అసలు నే నిక్కడ కొచ్చి నీతో మాట్లాడా ననే తెలియకూడదు' అని రహస్యంగా చెప్పి వెళ్లిపోయింది. ఈ సంగతి వినేసరికి తల్లికి మనస్సు మనస్సులోనే లేదు. తలుపు వేసుకొని లోపలగదిలో కుర్చీలో కూలబడింది. అపాయం ముంచుకొస్తోందనే నిశ్చయం తోచింది. తన కొడుక్కి ప్రమాదం రాబోతుంటే తాను చేతులు కట్టుకుని ఏడుస్తూ కూచోడం బాగా లేదనుకుంది. వెంటనే శాలువ కప్పుకొని బయలుదేరి మాజిన్ ఇంటికి వెళ్ళింది. అతడు సుస్తీగా ఉండడంవల్ల పనిలోకి వెళ్ళడం మానేసి కిటికీవద్ద కూచుని ఏదో చదువుకుంటున్నాడు. తల్లి సోదా సమాచారం చెప్పేసరికి అతడు ఉలిక్కిపడి లేచాడు. కంగారుగా గడ్డం గోకడంకూడా మొదలెట్టాడు.

'మన మిప్పు డేమి చెయ్యాలి' అంది తల్లి. 'కాస్తాగండమ్మ, భయం లేదులే' అన్నాడు మాజిన్.

'నామాట కేమిలే? నీవే చాలా భయపడుతున్నావేమి?' అంది తల్లి.

'నేనా?' అని మాజిన్ బలవంతంగా చిరునవ్వు తెచ్చుకొని 'అవును, నన్ను కొంచెం ఆ భయపిశాచం ఆవహించింది. ఈ సంగతి మనం పావెల్ కు తెలపాలి. మా చెల్లిని పంపుతానులే. మన్నేమీ కొట్టిచంపరులే. నీ వింటికి వెళ్ళు. మరేమీ ఫరవాలేదు' అని చెప్పి తల్లిని సాగనంపేడు.

తల్లి యింటికొచ్చింది. పావెల్ గదిలోఉన్న పుస్తకాలన్నీ ఒకచోటికి సర్దింది. వాటి నన్నిటిని ఎందుకో ముడిపెట్టుకుంది. ఏమీ తోచక ఇల్లంతా తిరిగింది. ఏ మూలయినా ఏబాపతైనా కాగితా లున్నాయేమోనని జాగ్రత్తగా వెతికింది. పొయిల సందులుకూడా వదిలిపెట్టలేదు. ఈ సంగతి తెలియడంతోనే పావెల్ పరుగెత్తుకొస్తా డనుకుంది. కాని అతను రానేలేదు. విసుగుతో కూచుంది.

కొంతసేపటికి పావెల్, నకోడాలు వచ్చారు. వారు వచ్చీరావడంతోనే తల్లి లేచి 'సంగతి తెలిసిందా' అని అడిగింది. 'ఆ, తెలిసింది. నీ కేమైనా భయమేస్తోందా?' అని పావెల్ అడిగాడు.

త :—తమాషా కాదూ? ఎవళ్ళూ నీకు యేమీ అపకారం చెయ్యనట్లు, ఇదంతా యేమిటో ఆషామాషీ వ్యాపారంలాగా మాటాడుతున్నావేం?

న :—అవును. ఈ మహాప్రపంచంలో అక్రమం జరుగనివాడెవడు? నాకు జరిగిన అన్యాయాలకు అక్రమాలకు అంతులేదు. కాని నిత్యం చస్తే వాడికి యేడ్చేవాడెవడు? నాకు కష్టం అలవాటైపోయింది. అంచేతే యేదైనా అన్యాయం జరిగినా నాకేమీ చీమకుట్టినట్లు లేదు. ఏమి చేస్తాం? మన యిష్టమా? నేను పడే కష్టాలు కొంతవరకు పని కడ్డే. అయితే మాత్రం యేం చేస్తాం? వాటిని తప్పించడానికి వసతి లేదు. కాబట్టి వాటిని గురించి ఆలోచించుకోకుండా ఉండడమే ఈ త్రోసుం. మునుపు అపుడపుడు బ్రతుకంటే రోత పుట్టేది. కాని ఇప్పుడు నలుగురినీ చూస్తే పరిపాటైపోయింది.

ఈ మాటలతో నకోడా తల్లి మనస్సును ఈ సోదా ఆలోచనానుంచి తప్పించేడు. తల్లి అతని గుండెనిబ్బరానికి చాలా సంతోషించింది.

నకోడా వంగుని గిన్నెలో నీరే కలుపుతూ 'అమ్మా! సుఖించాలనే వద్దనను; కాని దానికోసం దేవులాడడం మాత్రం నాచేత కాదు. నాకు తీరికా లేదు అదే నా పద్ధతి' అన్నాడు. పావెల్ ప్రస్తుతాలు చెప్పి వచ్చి భోజనానికి చేతులూ కాళ్ళూ కడుక్కున్నాడు. చేతులు తుడుచుకుంటూ "అమ్మా! నీవు మాత్రం జాగ్రత్తగా ఉండాలి. 'గుమ్మడికాయల దొంగా అంటే బుజాలు తడుముకున్నట్లు' వాళ్ళు వచ్చే సరికి భయపడకూడదు. నువ్వు గడగడా వణుకుతూ కనుపించావంటే, ఈ ఇంట్లో యేదో వున్నదని వాళ్ళు మరీ అనుమానపడతారు. మేమింకా యేమీ చేయలేదు. ఇంతేకాక మేము చేసేపనిలో యేమీ తప్పులేదని నీకూ తెలుసునుగదా? సత్యం, ధర్మం మాపక్షానే ఉన్నాయనికూడా నీకు తెలుసునుగదా? వీటికోసం మా జన్మంతా ధారపోస్తాం. ఇదే మా తప్పు. ఇందుకోసం మేమెందుకు భయపడాలి?"

తల్లి :—పావెల్! నేను జాగ్రత్తగానే ఉంటాను. భయపడను కాని, త్వరగా వస్తే బాగుండును. యేదో అయిపోతుంది.

ఆరోజున పోలీసులు సోదాచూడడానికి రాలేదు. మరునాటి ఉదయం తల్లి తానుపడ్డ కంగారుకు తానే [illegible]

౬

ప్రాయిటన్న రోజుకి సరిగా నెలరోజులయిన తర్వాత పోలీసులు సోదాచెయ్యడానికి పావెల్ ఇంటికొచ్చారు. ఆ సమయానికి ♦ నికోలే వెసోవిష్కొవ్ అక్కడే ఉన్నాడు. నికోలే, పావెల్, నఖోడ్కాలు ముగ్గురూ అర్ధరాత్రి దాకా తాము ప్రచురించబోయే పత్రికను గురించి ఆలోచించుకుంటున్నారు. తల్లి ఇవతలి గదిలో కూచుని కునికిపాట్లు పడుతోంది. నఖోడ్కా లేచి ఎందుకో వీధిగుమ్మంలోకి వెళ్ళేడు. అక్కడ అతనికి గుర్రపుకాళ్ళ సవ్వడి, బూట్ల టకటకలు, మనుష్యుల గుజగుజలు వినిపించాయి. నఖోడ్కా గబగబా లోపలికొచ్చి, పావెల్ కు ఉప్పందిచ్చేడు. తల్లికి మాటలు వినగానే పడుకున్నదల్లా మంచంమీద పడుకొనే గజగజలాడింది. పావెల్ లేచివచ్చి తల్లికి ధైర్యం చెప్పి, వీధిగుమ్మంవద్దకెళ్ళాడు. తలుపు తీసి 'ఎవరు కావాలి?' అడిగాడు. నల్లాలున ఇద్దరు సార్జెంట్లు ప్రత్యక్షమై పావెల్ ను ఒత్తిగించి గుమ్మందగ్గర చెరోప్రక్కనా నిలబడ్డారు.

'ఎవరూ? మీరు అనుకునేవాళ్ళం కాము' అని సన్నంగా రివటలా ఉండే ఆఫీసరు ఒకాయన దర్జాగా లోపల ప్రవేశించి తన నల్లటి చిరు మీసాన్ని మెలిపెడుతూ నిలబడ్డాడు. గ్రామపెత్తందారని, కమ్మరిపనిచేసే ఫ్యోదర్ మాజిన్ నూ, అతని ఎదుటింట్లో కాపురముండే రైతు రైబినునుకూడా మధ్యవర్తుల క్రింద వెంటపెట్టుకొచ్చారు.

'అయ్యా! ఇదిగో, ఇదేమిటండి' అంది అతని తల్లి. 'ఇదిగో ఇతడే అసలు మనిషి' అని తెల్లగా ఉన్నతన్ని, పావెల్ ను ఆఫీసరుకు చూపించాడు.

ఆఫీసరు మీసాన్ని సవరించుకుంటూ 'ఓహో! నువ్వేనా పావెల్? అయితే మీ ఇల్లు సోదా చెయ్యాలి. ఏయ్ ముసలమ్మా! లే అక్కడ లే' అని అధికారం చెలాయించడం మొదలెట్టాడు. ఇల్లు నాలుగు మూలలా కలియచూశారు.

'ఎవరక్కడ? ఇంకా ఎవరోఉన్నారే లోపల?' అని గద్దించాడు. నికోలే వెసోవిష్కొవ్, నఖోడ్కా ఇద్దరూ ముందుకువచ్చి నిలబడ్డారు. మధ్యవర్తిగా వచ్చిన రైబిను రైతు దగ్గరకొచ్చి తల్లికి నమస్కారం చేసేడు.

---

♦ పావెల్ స్నేహితుడు: సోషలిస్టు.

సంగతంతా చూస్తూవుంటే తల్లికి గాభరా ఎత్తుతోంది. 'ఏమిటి, మనుష్యులంతా గుర్రుపెట్టి నిద్రపోయే అర్ధరాత్రివేళ ఇల్లా కొంపల్లోదూరి గల్లంతు చెయ్యడమేమిటి?' అని తనలో తానే విసుక్కుంటూ వితర్కించుకుంది. భయంచేత చేతులు కట్టుకొని ఒకమూల నిలబడి జరుగుతుండే సంగతులన్నీ చూస్తోంది. దేహం కంపించింది. కళ్ళు తిరిగాయి.

పోలీసులు సోదా ఆరంభించారు. గదిలో వున్న పుస్తకాలన్నీ ఒకటొకటే చేత్తో పుచ్చుకొని ఆఫీసరు గబగబా పేజీలు తిరగేశాడు. కావలసిందేమీ దొరకకపోతే చిత్తుకాకితాల కట్టలను విసిరి పారేసేటట్లు రివ్వున విసిరి పారేసేవాడు.

'ఏమిటీపని? పుస్తకాలెందుకల్లా విసిరిపారెయ్యడం?' అని నికోలై ఆఫీసరును నిక్కచ్చిగా అడిగాడు. ఈ మాటమీద ఆఫీసరుకు కోపంవచ్చి ఏమిచేసిపోతాడో అని తల్లి గడగడలాడింది. ఆఫీసరు గుడ్లెర్రచేసి నికోలై కేసి చూశాడు. మళ్ళీ పేజీలు తిరగెయ్యడం మొదలెట్టాడు.

'ఏయి! సిపాయి! నిన్నే. ఆ పుస్తకాలు తియ్యవేం? అన్నీ సరిగా పెట్టు?' అని మళ్ళీ నికోలై దబాయించాడు.

ఆఫీసరు మళ్ళీ రౌద్రంతో చూశాడు. 'పుస్తకాలు [illegible]? తీస్తారు! తీస్తారు, తొందరపడకు' అని హుంకారం చేశాడు.

ఒక సిపాయి నికోలై కేసి చూస్తూ పుస్తకాలన్నీ జాగ్రత్తగా దొంతులు పేర్చాడు.

ఇంతలో ఆఫీసరు 'ఎవరది? ఏమి టాశబ్దం? కాస్సేపు [illegible]. ఎవరో బైబిలు చదువుతున్నట్లున్నారే?' అని అరిచాడు.

'నేను' అన్నాడు పావెల్.

'ఓహో! నువ్వా? ఈ పుస్తకాలన్నీ ఎవరవి?'

'నావే'

'ఓహో!' అంటూ ఆఫీసరు నెమ్మదిగా పడకకుర్చీమీద వ్రాలి కాళ్ళు బారసాచాడు. బద్ధకంతో మెటికలు విరిచి మీసాలు దువ్వుకుంటూ నికోలైకేసి తిరిగి నీ పేరేనా 'ఆంద్రీ నఖోడ్కా?' అని అడిగాడు.

'అవును' అంటూ నికోలై ముందుకెళ్ళాడు. నఖోడ్కా అతడి చెయ్యి పట్టుకొని వెనక్కిలాగి, 'అబ్బే! అతడు చెప్పినమాట సరికాదు. ఆంద్రీ నఖోడ్కాను నేను. అతను కాదు' అని ఆఫీసరుతో చెప్పేడు.

ఆఫీసరు నికోలేకేసి వేలుఊపించి నోటితో చుకచుక ధ్వనిచేసి 'జాగ్రత్త!' అని హెచ్చరించేడు. మళ్ళీ కాగితాలు తిరగెయ్యడం ప్రారంభించాడు. ఇంటిలోనివాళ్లు నిశ్శబ్దంగా ఎవరూ పెదవాడకుండానే ఉన్నారు.

ఆఫీసరు 'ఏమయ్యా నకోడా! ఇదివరకు రాజకీయనేరాలకోసం నీమకాం సోదా చేయబడిందా ఏనాడైనా?' అని చాలా అమర్యాదగా ప్రశ్న వేశాడు.

'ఆ, జరిగింది. ఇదివరకు కాజాన్‌లోను, సారవ్‌లోను సోదాఅయింది. కాని అక్కడ సోదా చెయ్యడానికొచ్చిన ఉద్యోగస్థులు మాత్రం నన్ను మర్యాదగా మిస్టర్ నకోడా అని పిల్చేవారు.'

ఆఫీసరు నకోడామాటల్ని గ్రహించేడు. 'అయితే, మిస్టర్ నకోడా! ఈ మధ్య ఫ్యాక్టరీలో ప్రభుత్వవిరుద్ధమైన కరపత్రాలను, పుస్తకాలను పంచిపెట్టేది ఎవరో నీకు తెలుసునా?'

నకోడా చిరునవ్వు నవ్వుతూ ఏదో చెప్పబోతున్నాడు—ఇంతలోనే నికోలే అందుకుని 'ఇక్కడ గూండాలను చూడడమిదే మొదటిసారి మాకు' అని వ్యంగ్యంగా చెప్పుకొచ్చేడు. అంతా తెల్లబోయి నిశ్చేష్టులయినారు. తల్లి ధైర్యం చేసి అలా చెప్పనక్కరలేదు.

'ఈ గాడిదని ఇక్కడనుంచి గెంటెయ్యండి' అని అతికోపంతో ఆఫీసరు హూంకరించాడు. ఇద్దరు సిపాయిలు నికోలేను వంట ఇంట్లోకి తీసుకుపోయారు.

'ఉండండి; కోటు తొడుక్కోవాలి' అని నికోలే సిపాయిలను దబాయించాడు.

ఇంతలో దొడ్లో సోదా చేస్తున్న పోలీసు కమీషనరు లోపలికొచ్చి 'ఎంత వెదికినా ఎక్కడా ఏమీ కనబడలేదు' అన్నాడు.

'అవును. ఆ సంగతి నాకు ముందే తెలుసును. ఇక్కడ ఈ విషయాల్లో బాగా ఆరితేరిన పెద్దమనిషి ఉన్నాడు.'

ఈ మాటలన్నీ వింటూంటే తల్లికి ఆఫీసరు యెడల పరమ అసహ్యం తోచింది. ప్రజలంటే యింత నిర్లక్ష్యంతో చూచే ఇతడెవడా అనుకుంది. ఇంత కర్కోటకమనిషిని ఆమె ఎప్పుడూ చూడలేదు. ఇల్లాంటి కటికి వాళ్ళతోనే పావెల్ ప్రభృతులు పోరాడుతున్నారనే సంగతి తలుచుకొనేసరికి ఆమె కెంతో ధైర్యం కలిగింది. ఆఫీసరు నకోడాకేసి చూశాడు.

'ఏయ్; మిస్టర్ * ఆంద్రీ అనిస్‌మావ్ నఖోడా! నేను నిన్ను అరెస్టు చేస్తున్నాను.'

'ఎందుకు?'

'ఆ సంగతి తర్వాత చెప్తానుత్తే' అని పోలీసు ఆఫీసరు తల్లికేసి తిరిగి 'ఏయ్! నిలోనా వాసవ్! నీకు చదువొచ్చునా?' అని అడిగాడు.

'రాదు' అన్నాడు పావెల్.

'నిన్నడగడంలేదు. నువ్వెందుకు జవాబు చెప్తావు?............ ఏయి! ముసలమ్మా! నీకు వ్రాయడం చదవడం తెలుసునా?' అని ఆఫీసరు గట్టిగా తల్లి నడిగాడు.

ఈధోరణిచూస్తే మరింతచిరాకెత్తింది తల్లికి. కార్తీకమాసంలో తెల్లవారుఝామున చన్నీళ్ళస్నానం చేసినవాళ్ళు వణికేటట్లు గడగడలాడింది. చివరకు ఎట్లాగో ధైర్యం చిక్కబట్టుకొని 'ఏమిటయ్యా, అట్లా అరుస్తావేమిటి? నీవింకా చిన్నవాడివేనే, అభం శుభం ఎరుగనట్లున్నావు. ఎప్పుడూ నీకు కష్టం నాటలేదనుకుంటాను' అంది.

పావెల్, నఖోడాలు తల్లిని తొందరపడొద్దని హెచ్చరించారు. ఆమె కొంచెం సర్దుకుని ఆఫీసరుకేసి తిరిగి 'ఏమయ్యా! ఇట్లాజనాన్ని ఎందుకయ్యా ఎత్తుకెడుతున్నారు' అని అడిగింది.

'ఆ సంగతి నీ కెందుకు? ఊరుకో' అని ఆఫీసరు తల్లిని కసిరికొట్టి సిపాయిలను పిలచి నికోలాను తీసుకు రమ్మనమని ఆజ్ఞాపించాడు. తానేదో కాగితాన్ని బిగ్గరగా చదవడం మొదలెట్టేడు. ఇద్దరు సిపాయిలు చెరొక చేతిని పట్టుకొని నికోలేను తీసుకువచ్చారు.

'టోపీతియ్యి' అని గర్జించాడు ఆఫీసరు. 'రెండుచేతులు చెరొకళ్ళు పట్టుకుంటే టోపీతియ్యడ మెట్లాగ' అన్నాడు గట్టిగా నికోలే. ఆఫీసరు ఒక కాగితాన్ని బల్లమీద పడేసి దస్కత్తుచేయండని ఆజ్ఞాపించాడు. అంతా కిక్కురుమనకుండా దస్కత్తుచేసేరు. ఈ చర్యంతా చూస్తే ఆమెను గ్రుడ్లలో నీళ్ళు తిరిగాయి. నిస్సహాయత్వం తోచింది. ఈమధ్య లేదు. కాని నిస్పృహతో యేడ్వడం ఆమెకు క్రొత్తగాదు. మొగుడు చావుదెబ్బలు కొడితే యేంచెయ్యలేక యేడ్చేది. ఈ వాలకం అంతా చూస్తే ఆమెకు ఆ రోజులు జ్ఞప్తికొచ్చాయి.

* నఖోడా పూర్తిపేరు.

ఆఫీసరుకు ఆమె ఎంతచెప్పినా జాలి కలుగలేదు. పైగా అతి పొగరు బోతుతనంగా 'ఎంత చేస్తున్నావు? నుంచుంది ముసల్దిపండుగ. ఏడ్చేరోజు లింకా ఉన్నాయి. ఏడుపులన్నీ ఇప్పుడే అయిపోతే ముందుకష్టం' అని హేళనచేశాడు.

'బిడ్డలను కన్నతల్లి ఏడుపులకు కొదవలేదు, నాయనా! నీకు తల్లి అంటూ వుంటే ఆమె నడుగు. ఆమెకు బాగా తెలుస్తుంది.'

ఆఫీసరు నిదానంగా కాగితాలను తన సంచిలో పడవేసుకున్నాడు. పోలీసు ఇన్స్పెక్టరువైపు తిరిగి 'మా నగరాలలో జనం బాగా తెలివిమీరారు. సుమా!' అన్నాడు, ఇన్స్పెక్టరుతో. 'చిత్తం, బుద్ధి తిరుగుబోతు రకాలండీ,' అని వప్పుకున్నాడు.

సిపాయీలకు ఖైదీలను తీసుకుపొమ్మని ఆఫీసరు ఆజ్ఞ ఇచ్చాడు. పావెల్ నికోలై, నకోడ్కా అనద్దల కరచాలనం పుచ్చుకొన్నాడు. ఒకళ్ళనొకళ్ళు అభినందించుకున్నారు. నికోలై పావెల్ చేతిని గట్టిగా గుండెలమీద అదుముకొని ఉద్రేకపడిపోయాడు. నకోడ్కా చిరునవ్వునవ్వి తల్లితో ఏమిటో చెప్పాడు. ఆమె దయామయుడగు క్రీస్తుదేవుని స్మరించి చేతితో కళ్ళనద్దుకొని నకోడ్కా నాశీర్వదించింది.

ఆఫీసర్లు, ఖైదీలుగూడా ఇంట్లోంచి వెళ్ళిపోయారు. ఈ తంతు అంతా మొదటినుంచి చివరిదాకా చూస్తున్న మధ్యవర్తి రైబిన్ ఆఖరున వెళ్ళాడు. వెళుతూ పావెల్‌ను పరామర్శించి వెళ్ళాడు.

పావెల్ గదిలో పచార్లుచేశాడు. నికోలై, నకోడ్కాలతోపాటు తన్ను కూడా అరెస్టు చెయ్యకపోవడం ఒక పెద్ద అగౌరవంగా భావించి విచారపడ్డాడు. తల్లితో 'చూశావా అమ్మా. ఎంతపని చేశారో! నన్ను వదలిపెట్టారు' అన్నాడు.

తల్లి సంతోషంగా 'నిన్నుమాత్రం ముంచుతారా, నాయనా? నువ్వూ వెడతావులే' అంది. చాలా సేపటివరకూ తల్లి ఆ గొడవనే ఆలోచించుకుంది. ఇక్కడికివచ్చి మనుష్యుల పట్టి తీసుకుపోయారేమో అనుకుంది. కాని తన కొడుకు ఇంటివద్దనే ఉండడంచేత కొంత మనస్సుకు శాంతిగానే వుంది. కాని ఆ ఉద్యోగస్థుడు గర్జించడం, బెదిరించడం, హేళనచేయడంమాత్రం పదే పదే జ్ఞాపకంవచ్చి ఆమెకు మనోకష్టంతోచింది. పచారు చేస్తూఉన్న పావెల్

హఠాత్తుగా 'సరి, అమ్మా ఇక అనుకుని ఏమీ లాభం లేదు. ఇలాంటి అవమానాలకి సంసిద్ధం కావాలసిందే' అన్నాడు.

'ఏం నాయనా! నిజంగా వాళ్లు నిన్ను అవమానపరిచారా?'

'ఆహా! అవమానం కాదూ? నన్నుకూడా వాళ్ళతో తీసుకెళ్ళక పోవడం?' ఈమాట చెపుతూంటే తల్లికి అతని కొలికెల్లో కన్నీటిముత్యాలు కనబడ్డాయి. అతన్ని ఓదార్చే భావంతో 'అంత తొందరం వద్దు నాయనా? నిన్నుకూడా తీసుకెడతారులే' అంది.

'ఆ! తప్పకుండా తీసుకెడతారు' అన్నాడు. తల్లి కొంచెంసేపు మాటాడలేదు. తర్వాత అతి విచారంతో 'నాయనా పాషా! నీ వెంతకఠిన హృదయుడవైనావోయి! మాటవరుసకైనా నాకుచల్లనిమాట చెప్పవుకదా! నేనే చాలా కష్టంగా మాటాడితే, నువ్వు అంతకన్నా ఘోరంగా మాట్లాడ తావు' అన్నది. పావెల్ ఆమెకేసి దీనంగా చూసేడు దగ్గరగావచ్చి మెల్లగా 'అమ్మా! నేను నీ దగ్గర అబద్ధం చెప్పలేను. నన్నుకూడా ఎప్పుడో ఒకప్పు డిల్లాగే తీసుకుపోతారు. అలాంటి కష్టానికి నీవు అలవాటు కావలసిందే' అన్నాడు.

## ౨

మరునాడు బూకిన్, సోమో, శామొలో మొదలైన వాళ్ళంతా మొత్తం ఎనమండుగురు అరెస్టయినారు. ఆ క్రితంరోజు సాయంత్రమే ఫెడ్యా మాజిన్ ఇల్లుకూడా సోదా చూసేరు. ఫెడ్యా ప్రొద్దున్నే పరు గెత్తుకుంటూవచ్చి పావెల్‌తో సంగతంతా చెప్పాడు.

'నీ కేమైనా భయం వేసిందా?' అని తల్లి పరామర్శించింది. ఫెడ్యా తెల్లబోయాడు మాట తొణకలేదు.

'ఆఫీసరు కొడతాడేమో ననుకున్నాను. అతని మీసం, గడ్డం, ఒడ్డూ, పొడుగూ, వేషం గట్రా చూస్తే మహాభయంకరంగా వుంటాడు. అతను హాట్, హూట్ అని అరుస్తూ చిందులుతొక్కి నానాగత్తర చేశాడు. నువ్వు జైలులో కుళ్ళుతూ పడుండాలి సుమా అని బెదరించాడు. నిజంగా నా జన్మలో నే నెవ్వరిచేత ఒక దెబ్బ పడలేదు. నా తలిదండ్రులకు నే నొక్కడినే అవడంవల్ల వాళ్ళు ఒకదెబ్బయినా కొట్టకుండా అతి

అపురూపంగా పెంచారు. అంతా, ఎప్పుడో ఒకప్పుడైనా ఒకటీ అరా దెబ్బతినుంటారేమోగాని నే నింతవరకు ఎప్పుడూ దెబ్బంటే ఏమిటో యెరుగను' అంటూ ఫెద్యా పళ్లు పటపట కొరికాడు. కళ్లెర్రచేసి పావెల్ కేసి తిరిగి 'నువ్వేమనుకున్నా సరేగాని, యీసారి యెవరైనా నా వొంటిమీద చెయ్యేస్తే నే నూరుకోను. ఏమీ చెయ్యలేకపోతే ఆఖరుకు గట్టిగా కరవనైనా కరుస్తా. నన్నాతరువాత చంపేసినా సరే!' అని అతి రోషంతో చెప్పాడు.

'నువ్వు ఆత్మసంరక్షణలో యేం చేసినా చెయ్యొచ్చునుగాని, నువ్వు మాత్రం అనవసరంగా మీద కెళ్ళకు' అని పావెల్ సలహా చెప్పాడు.

'ఇదిగో చూడు! నువ్వు అర్భకుడవు. నీకు దెబ్బలాట వద్దు. జాగ్రత్త!' అని తల్లి మందలించింది.

'ఊహుం, నేను దెబ్బలాడక మానను' అని వెళ్ళిపోయాడు ఫెద్యా.

అతను వెళ్ళిపోయిన తర్వాత తల్లి పావెల్‌తో 'ఇంత జోరుగా కబుర్లు చెప్పేవాళ్ళే ముందు భోల్తాకొడతారు' అంది. పావెల్ మాట్లాడలేదు.

కొంచెంసేపట్లో గ్రామంలోకల్లా మోతుబరి రైతు రైబిన్ తలుపు తోసుకొని లోపలికొచ్చాడు.

'మళ్ళీ వచ్చాను. నిన్న పోలీసువాళ్ళు తీసుకువచ్చారు. ఇవ్వాళ నా అంతట నేనే వచ్చాను' అంటూ పావెల్‌ను కరస్పర్శ చేశాడు. తల్లికేసి తిరిగి 'ఏమమ్మాయి! కొంచెం టీ ఇస్తావా?' అని అడిగాడు.

తల్లి టీ తీసుకురావడానికి లోపలి కెళ్ళింది. రైబిన్, పావెల్‌లు ఒకళ్ల ముఖం కేసి ఇంకొకళ్లు చూసుకుంటూ మాటాడకుండా కూచున్నారు. ఆఖరికి 'అదీ సంగతి' అని రైబిన్ ఏమిటో అర్ధాంతరంగా ప్రారంభించాడు. 'అబ్బాయీ! నీతో ముఖాముఖిని కొన్ని సంగతులు నిర్మొగమాటంగా మాటాడవలెనని వచ్చాను. ఇందులో యేమీ దాపరికం లేదు. నేను చాలా రోజులుగా నీ ధోరణి కనిపెడుతున్నాను. ప్రక్క యింటివాడినే కదూ? నీ దగ్గరకు జనం రావడం పోవడం చూసేను. ఆ వచ్చేవాళ్ళల్లో తాగుబోతుతనం కాని మరో జులాయి వ్యాపారంగాని లేకపోవడం చూస్తే నాకూ చాలా ఆశ్చర్యమైంది. ఆ త్రాగుబోతు పిశాచం అంటుకోకపోతే జనం మహా సులువుగా తెరిపిని పడతారు.'

ఈ మాటలు వింటూంటే పావెల్‌కు అతనియందొక విశ్వాసం కుదిరింది.

రైబిన్ ఇంకా మాట్లాడుతూనే వున్నాడు 'అంతా నిన్ను గురించే చెప్పుకుంటూన్నారు. నాలాగే నువ్వుకూడా చర్చికి వెళ్ళవుట కాదూ? అయితే ఈమధ్య బయల్దేరిన కరపత్రాలకు నువ్వేనా కారకుడవు?' అని పావెల్ నడిగాడు.

'అవును. నేనే' అన్నాడు పావెల్. ఇద్దరూ ఒకళ్ళమొహం కేసి ఇంకొకళ్ళు చూచుకున్నారు.

'నువ్వొక్కడవే అన్నమాటేమిటి?' అని తల్లి పావెల్ మాటను సద్దబోయింది.

పావెల్, రైబిన్ యిద్దరుకూడా నవ్వుకున్నారు. తనమాట లక్ష్య పెట్టలేదనే ఆగ్రహంతో తల్లి లేచిపోయింది. రైబిన్ మళ్ళీఅందుకున్నాడు:

'ఆ కరపత్రా లున్నాయే, అవి చాలా బాగా వున్నాయి. బాగా చక్కగా ఆలోచించి వ్రాసినవే. ప్రజలను మేలుకొల్పేందుకు బాగా పని కొస్తాయి. అవి మొత్తం పన్నెండు కాదూ?'

'అవును.'

'ఇక సోదా సంగతి. అన్నింటికన్నా ఆ సమయంలో నిన్ను చూచి నప్పటినుంచి నీయెడల నాకు ఒకవిధమైన అభిమానం యేర్పడింది. నువ్వూ, ఆ నకోడా, నికోలే మీరంతా దొరికిపోయారు. సోదాకొచ్చిన వాళ్ళుకూడా మీధోరణి కనిపెట్టేరు. మహానిర్లక్ష్యంగా వ్యవహరించారు కాదూ మీరు? నకోడా బలేమనిషి. ఆతడు ఫ్యాక్టరీలో మాటాడుతూవుంటే విన్నాను. చావుకైనా తెగించిన పట్టుదల వుందనుకున్నాను. పావెల్! నే నంటే నీకు నమ్మకంలేదూ?'

'ఉంది.'

'సరే, అయితే, చూడు! నాకు నలభైఏళ్లున్నాయి. నీకన్న దగ్గర దగ్గరగా రెట్టింపు వయస్సుంది నాకు. నీకన్న ప్రపంచాన్ని ఇరవై రెట్లు చూశాను. మూడేళ్లు పాదాలు అరిగేటట్లు మిలిటరీలో తిరిగి పనిచేశాను. రెండుసార్లు పెళ్ళిచేసుకున్నాను. నేను కాకసస్ కూడా వెళ్ళేను' అని రైబిన్ స్వీయచరిత్ర ఆరంభించాడు.

తల్లి యీ సంభాషణ వింది. తన కొడుకుదగ్గరకు పెద్దవాళ్లుకూడా వచ్చి మాటాడడం చూసి లోపల్లోపల సంతోషించింది. టీ తీసుకొచ్చి

రైబిన్ కందిచ్చింది. అతడు కృతజ్ఞతతో అందుకొని ఒక గ్రుక్కెడు త్రాగి మళ్ళీ సంభాషణ ఆరంభించాడు.

'అయితే పావెల్! మన జీవితం నడవవలసిన రీతిగా నడవడం లేదంటావు, అంతేనా?'

'అచ్చే! సరిగానే నడుస్తోంది. కనుకనే ఇప్పుడు మీ రిక్కడికొచ్చి ఇంతవిపులంగా మనసిచ్చి మాటాడడం తటస్థించింది. చెమటోడ్చి కష్టపడి బ్రతికే మనమంతా ఒకటవుతాం. కొద్దిరోజులకు మన సంఘీభావం అద్భుతంగా ఉంటుంది. ప్రస్తుతం మన బ్రతుకు మరీ అన్యాయంగా వుంది. బహుభారంగా వుంది. కాని, ఈ అన్యాయమే మనలను మేల్కొల్పి, జీవితపరమావధిని గురించి హెచ్చరిస్తోంది. మనం ఇప్పటికి మన స్థితిగతులను గూర్చి ఆలోచించుకుంటున్నామా, లేదా?'

'అవునవును. కాని ఆగు. మనుష్యులలో పూర్తిగా మార్పు కలగాలి. ఒకవిధంగా పునఃసృష్టి కావాలనే నాఅభిప్రాయం. మురికిపట్టి అసహ్యంగా ఉండేమనిషి వున్నాడనుకో, అతనికి స్నానంచేయించి శుభ్రమైన బట్టలు కట్టపెడితే బాగుంటాడుకదా. అల్లాగే హృదయం మలినమైతే దాన్ని ఎలాగో ఒకలాగున బయటికితీసి శుభ్రం చెయ్యాలి. అంతేనా? ఏమంటావ్? మనుష్యులను బాగుచెయ్యడాని కేమైనా వేరే మార్గం ఉందంటావా!'

పావెల్ యీప్రసంగమంతా విని దేవుడ్ని గురించి, ప్రభుత్వాన్ని గురించి, ఫ్యాక్టరీనిగురించి, చక్రవర్తిని గురించి, ఇంకా ఇతరదేశాల్లో కూలినాలి జనాన్నిగురించి, వాళ్ళలో బయలుదేరిన విప్లవభావాలను గూర్చి అతితీవ్రంగాను, కటువుగాను వుండేటట్లు విపులమైన ఉపన్యాసం యిచ్చాడు. రైబిన్ శ్రద్ధగా విన్నాడు. మధ్యమధ్య చిరునవ్వు నవ్వేవాడు. 'అయితే' అని ఊతంకూడా యిస్తూవచ్చాడు. ప్రసంగవశాత్తు ఒకసారి ఏదో సందర్భంలో అతడు పెదవి విరిచి 'అచ్చే! నీ వింకా కుర్రాడివి. ప్రజలసంగతి నీ కేమి తెలుసును' అని చప్పరించేశాడు.

'వయస్సుతో ఏమిపని? మనం అనుకున్న మాటలలో సత్యం ఎక్కడుందో ఆలోచించుకోవాలి.'

'అంటే నీ అభిప్రాయం ప్రకారం మనం దేవుడి విషయంలోకూడా దగాపడ్డామన్న మాటే... అవును. నాకూ అప్పుడప్పు డల్లాగే తోస్తుంది. మనకు మతమే అపాయకర మనిపిస్తుంది.'

ఇంతవరకు మాటాడకూరుకున్న తల్లి ఇంక ఊరుకో లేకపోయింది. ఏమన్నా భరించింది కాని, తా నత్యంతభక్తివిశ్వాసములతో కొలుస్తున్న దేవుడిని గురించి చులకనగా మాటాడుతుంటే ఆగలేకపోయింది.

'పావెల్! దేవుడ్నిగురించి మాటాడేటప్పుడు కాస్త జాగ్రత్తగా ఉండు. నువ్వుచేసే పనులకు ఈ జన్మలోనే ప్రతిఫలం ఉంటుందిసుమా! ఈ వృద్ధాప్యంలో నేను నమ్ముకున్న దేవుడ్ని ఇల్లా తీసిపారెయ్యకు' అని దీనంగా పావెల్‌ను వేడుకుంది. పాపం గ్రుడ్లలో నీళ్ళుతిరిగేయి. కడుగుతూ వున్న గిన్నెలు చేతిలోనుండి జారిపోయాయి. పావెల్ తల్లిఅవస్థ చూచేడు.

'అమ్మా నేను చెప్పినసంగతి నువ్వు సరిగా అర్థంచేసుకోలేదు. నీవు విశ్వసించే పరమదయాళువైన దేవుడినిగురించి నేను చెప్పలేదు. దేవుడి పేరు చెప్పి మనలను బెదరించే మతగురువుల దేవుడినిగురించే నేను చెప్పినది. ఈ మతాధిపతులు దేవుడిపేరు చెప్పి తమ చిత్తం వచ్చినట్లు మనమీద జబర్దస్తీ చేస్తారు.'

'అవునవును. నువ్వు చెప్పినది నిజమే. ముమ్మాటికి నిజం' అని బల్లగుద్ది రైబిన్ అందుకున్నాడు. 'మతగురువులు దేవుడ్ని కాళ్ళూచేతులూ విరుగగొట్టి మూల కూచోపెట్టేరు. వాళ్ళ లోపంలేకుండా మనకు ఎన్ని కష్టాలు తెచ్చిపెట్టాలో అన్నీ పెట్టేరు. అన్ని విధాలా మనకు శత్రుత్వం తెచ్చిపెట్టారు. అమ్మా ఒక్క సంగతిచూడు. దేవుడు మనిషిని తన ఛాయగా సృష్టించాడు. మనిషి దేవుడులాఉంటే దేవుడు మనిషిలా ఉంటాడన్నమాటేకదూ? కాని మనం మనుష్యుల్లా ఉన్నామా? శుద్ధ అడవి జంతువులైపోయాము. చర్చిలో దిష్టిబొమ్మ నొకదానిని మన ఎదుట పెడతారు. నిలోనా! మనం దేముడ్ని మార్చుకోవాలి. బాగుచేసుకోవాలి. ఆ దేవుడ్ని ఈ మతగురువులు అన్యాయం, అసత్యం, అధర్మాలతో అలంకారంచేసేరు. మన ఆత్మలను నాశనం చేయడంకోసం దయాళువైన దేవుడ్ని వాళ్ళు వికృతస్వరూపుని చేసిపారేసేరు.'

నదురూ బెదురూలేకుండా చెప్పిన ఈ మాటలు వింటూంటే తల్లికి గాభరా ఎత్తింది. ఆ మాటలు వినలేకపోయింది. చెవులు మూసుకొని వంటయింట్లోకి పోయింది. బట్టలు మార్చుకొని మంచంమీద పడుకుని కళ్ళుమూసుకుని ప్రార్థనచేయడం ప్రారంభించింది. ఆమెకు మనస్సు మనసులో లేదు; రైబిన్ అంటే ముందు చాలా మంచివాడనే అనుకుంది. కాని

దేవుడి విషయమై అతని అభిప్రాయాలు విన్నాక ఆమె మనస్సు మారి పోయింది. అతడొక సంఘద్రోహి. రాజద్రోహి అనుకుంది. పావెల్— రైబిన్ లిద్దరూ గదిలోనే చర్చించుకుంటున్నారు. రైబిన్ మాట్లాడు తున్నాడు.

'పవిత్రస్థలాలు ఖాళీగా ఉండకూడదు. ఎక్కడైతే బాధఉంటుందో అదే భగవంతుని నివాసస్థానము. ఒకసంగతి చెపుతాను. జాగ్రత్తగా ఆలో చించు. హృదయంలో భగవంతుడున్నంతవరకే బ్రతుకు. పావెల్! మన మొక కొత్తమతాన్ని లేవదీయక తప్పదు. చాలా అవసరం. అందరికీ అందు బాటులో ఉండేటట్టు దేవుడ్ని నిర్మించాలి. దేవుడంటే అధికారం చెలా యించేవాడు, జబర్‌దస్తీ చేసేవాడు కాకుండా మానవకోటికి మిత్రుడుగాను విశ్వాసపాత్రుడుగాను ఉండాలి.'

'ఇప్పుడలాంటి దేవుడున్నాడు. క్రీస్తు కాదూ?'

'కొంచెం ఆగు చెప్తాను, క్రీస్తు చాలడు. ఆతడు చక్రవర్తి అధి కారాన్ని అంగీకరించాడు. భగవంతుడు మానవమాత్రుల అధికారాలను గమనించకూడదు. అతడే సర్వశక్తులకు మూలం. అతడు తన ఆత్మను రెండుగా చీల్చి ఒకటి మానవశక్తికి, రెండవదానిని దైవికశక్తికి అర్పించడు. క్రీస్తు పూర్తిగా దేవదూతయైనప్పటికీ మానవ విషయములలో జోక్యం కలుగ జేసుకొని యుండడు. కానీ క్రీస్తు వర్తకమును, పెళ్ళిళ్ళను అంగీకరించాడు.

పావెల్, రైబిన్ ఈవిషయమై ఒకళ్లనుమించి ఒకళ్లుచర్చించుకుంటూ న్నారు. కాలం గడిచిపోతూన్న సంగతి వాళ్లకు తెలియడమేలేదు.

రైబిన్ 'దేవుడు అగ్నిహోత్రంలాంటివాడు. అతడు దేనినీ నిర్మించ లేదు; నిర్మించడు. కాని అన్నింటినీ అంటిస్తాడు. వెలుగు చూపిస్తాడు. చర్చి లను అతడు తగులబెట్టేస్తాడు. హృదయమే అతని నివాసస్థానము' అన్నాడు.

'మనస్సో?' పావెల్ అడిగాడు.

'అదే హృదయంలోనూ మనస్సులోనూకూడా అక్కరకువస్తుంది. అగాదా, పేచీల కదే మూలం. హృదయం మనస్సు చాలావేరైపోయి నాయి. మనస్సు అంతరించిపోయింది. మనిషి స్వతఃసిద్ధంగా ఒక ప్రమాణం కాదు. భగవంతుడే అతన్ని ప్రమాణంగా చేశాడు. భగవంతుడు చేసేవన్నీ సుందరంగా ఉంటాయి. సూర్యుడు, చంద్రుడు, భూమి మొదలైనవి. అష్టవిద్దాలుగా ఉండేవన్నీ మనుష్యుని పనులే.'

లోపల వాళ్ళిద్దరూ మాటాడుతుండగానే తల్లి నిద్రపోయింది. రైబిన్ ఎప్పు డెళ్ళిపోయాడో ఆమెకు తెలియదు.

రైబిన్ తరుచుగా పావెల్ ఇంటికివచ్చి నలుగురితోటి అనేక విషయాలను చర్చచేస్తూవుండేవాడు. ఒకనాడు సందర్భవశంగా అక్కడకు వచ్చిన మిత్రులతో అత డిట్లా చెప్పాడు.

'ఏమయినాసరే, మనం ఉన్న సంగతి చెప్పాలి. తెలిసినంత తెలియపర్చాలి. ప్రజలకు బంధాలు విడిపోతే తరువాత తమ మంచేదో వాళ్ళకే తెలుస్తుంది. అనవసరంగా వాళ్ళకక్కరలేని సంగతులన్నీ చెప్పి బాధపెట్టకూడదు. ఉన్న సంగతి సందర్భాలన్నీ వాళ్ళ చెవినిపడేస్తే, తరువాత సంగతి వాళ్ళే ఆలోచించుకుంటారు. ఒకప్పుడు వాళ్ళు యీ జీవితాన్నే త్రోసిరాజనొచ్చును. ఇంకొకప్పుడు తమకు ప్రతికూలంగావున్న శక్తులన్నిటిని గ్రహించవచ్చును. ఒక్క సంగతిమాత్రం స్పష్టంగా చెప్పాలి. లాగలేని బరువువేస్తే అసలు బండే లాగదు.'

* * * *

పావెల్, రైబిన్ లిద్దరుమాత్రమే ఉన్నప్పుడు, అంతూపొంతూలేని చర్చల్లోపడేవారు. ఎంతశ్రద్ధగా ఆలకించినా తల్లికి కా గొడవ పిసరంతైనా తెలిసేదికాదు. ఇద్దరికీకూడా మతిపోయిందేమో ననుకొనేది. కాని క్రమేణ యీ సంభాషణలు వినడం అలవాటైపోయింది. రైబిన్ దైవద్రోహి అనే ద్వేషం పోయింది.

* * * *

వారానికొకసారి తల్లి జైలుదగ్గరకెళ్ళి నకోడాకు పుస్తకాలు, బట్టలు యిచ్చేది. ఒకనాడు అక్కడి వార్డరులు ఆమెను నకోడాతో కొంచెం మాటాడనిచ్చారు. ఆ రోజున ఇంటికొచ్చి అతిసంతోషంగా రైబినూ, పావెల్ కూర్చుండగా ఇట్లా చెప్పింది. 'అక్కడకూడా ఇంట్లో ఉన్నట్టుగానే ఉన్నాడు. అందరితోనూ, చనువుగా, నవ్వుతూ, త్రుళ్ళుతూ ఉన్నాడు. అందరితోనూ వేళాకోళాలాడుతున్నాడు. అతని ధోరణంతా చూస్తే శెలవుల్లో విశ్రాంతి అనుభవిస్తున్నట్టుంది. లోపల ఏమి కష్టమనుభవిస్తున్నాడో తెలియదుకాని, పైకి ఏమీ కనబడనియ్యడంలేదు.'

"మనిషంటే అల్లాగే వుండాలి" అని రైబిన్ అందుకున్నాడు. మనకందరికీ వుంది బాధ. మనుషులందరూ అసలు బాధల్లో మునిగి తేలుతూనే వుంటారు. కాని వూరికే లబలబ మొత్తుకుంటే ప్రయోజనమేంటి? ప్రజలంతా గుడ్డివాళ్ళుకారు. కాని కొందరు మూసుకోవాలనే మూసుకుంటారు కళ్ళు. నువ్వు బుద్ధితక్కువవాడవైతే అలాంటి వాళ్ళకోసం బాధపడాలి.

౮

పావెల్ పలుకుబడి రోజురోజుకి హెచ్చయిపోతోంది. పలుకుబడితో పాటు అధికారుల అనుమానంకూడా పెరుగుతూనేవుంది. తరుచు ఎవడో ఒక పనివాడు వచ్చి యేదోవిషయమై పావెలుతో సలహాచేస్తూనే యుండేవాడు. అతడు బాగా చదువుకున్నవాడని, బుద్ధిమంతుడని పేరు పడిపోయింది. పోలీసులుగాని, ఫ్యాక్టరీయజమానులుగాని యెవరికైనా యేదైనా అన్యాయంచేస్తే వెంటనే వాళ్ళు పావెల్ సలహాకోసం వచ్చేవాళ్ళు. వయస్సుకి చిన్నవాడైనా అతని కార్యదీక్ష, బుద్ధికుశలత, శ్రద్ధచూచి అంతా అతన్ని మిక్కిలి గౌరవంగా చూచేవారు. ఈరీతిగా ప్రజలకూ పావెలెల్ కూ అన్యోన్యం ఎక్కువైపోయింది. ఇంతెందుకు? ఆ గ్రామంలోవుండే జనానికంతా అతడు నోట్లోనాలుకన్నమాటే. తన కొడుకు పలుకుబడిచూచి తల్లి చాలా గర్వపడేది. ఏతల్లి కలాంటి గర్వం కలుగదు? పావెల్ అచట ప్రజల క్షేమాని కవసరమైన పనులన్నిటిలోనూ పూనుకొని పనిచేసేవాడు. వ్యాసాలు రాయడం, ఉపన్యాసాలివ్వడం సంఘ పెద్దలను సమావేశం చేస్తూవుండడం, మొదలైన సత్కార్యాలన్నీ చేస్తూవుండేవాడు. ముఖ్యంగా అతడు ప్రకటించిన 'దరిద్రపుపైసా' అనే కథ చదివిన తర్వాత జనానికి అతనిమీద అత్యంతమైన అభిమానం యేర్పడింది.

దానికథ ఏమిటంటే, ఫ్యాక్టరీ వెనకాల పెద్దగుంటవుంది. ఆగుంటలో ఎప్పుడూ నీళ్లు నిలవవుండడం, పసరుపట్టి దుర్వాసన రావడం కద్దు. పైగా దోమలుకూడా విపరీతంగా పెరిగిపోయాయి (దోమలమూలాన్ని మలేరియా జ్వరం వ్యాపించింది.) ఈస్థలం ఫ్యాక్టరీ యజమానులదే. ఫ్యాక్టరీ కెంత

లాభాలు వస్తున్నా, ఈగుంట పూడ్చి నీరు మురగకుండా చెయ్యాలనే శ్రద్ధ అధికారుల కెప్పుడూ పట్టలేదు.

ఫ్యాక్టరీలోకి క్రొత్త మేనేజరు వచ్చాడు. అతడు ఈగుంటను పూడ్చే పద్ధతొకటి ఆలోచించాడు. ఒక్కాయకు రెండు దెబ్బలనేట్లు ఇందులో కాస్త స్వలాభంకూడా సంపాదిద్దామని ఎత్తేశాడు. ఫ్యాక్టరీ పనివాళ్ళందరినీ పిలిచి ఈ మురుగు పోయే ఏర్పాటు చేయడం చాలాఅవసరమనీ, అందువల్ల దోమలు తగ్గి ప్రజల ఆరోగ్యం బాగుపడుతుందనీ ఉపన్యాస మిచ్చాడు. చివరికి ఈపనంతా చేయించడానికి ప్రతికూలియొక్క కూలీలోనుంచి రూబుకొక్క ♦ కోపెక్ మినహాయించమని ఆజ్ఞరిచ్చాడు. పనివాళ్ళంతా వల్లకాదని తిరగబడ్డారు. గుమస్తాలవదనుండి ఈ పన్ను వసూలు చెయ్యక ఒక్క కూలీల దగ్గరే వసూలు చెయ్యడంచేత వాళ్ళకి మరింత ఒళ్ళుమండింది.

మేనేజరు ఆర్డరు, నోటీసుబల్లమీద శనివారంనాడు అంటించారు. ఆరోజున వంట్లో సుస్తీగా ఉండడంచేత పావెల్ పనిలోకెళ్ళలేదు. ఈ ఆర్డరుసంగతి అతనికి తెలియనేలేదు. ఆ మరునాడు చర్చినుండి తిరిగి వస్తూ, 'సిజావ్' అనే ముసలి కమ్మరీ, 'మకోటిన్' అనే ఇంకొక తాళాల పని చేసేవాడూ పావెల్ దగ్గరకొచ్చి సంగతి సందర్భాలన్నీ అతనితో చెప్పారు.

"ముసలివాళ్ళం మేమంతా ఆలోచించాం. కాని మనవాళ్ళల్లోకల్లా కాస్త చదువుకున్నవాడవు, తెలివైనవాడవు నువ్వే. అందుచేత మావాళ్ళంతా నీతో ఆలోచించమన్నారు. దోమలమీద దండయాత్రకి కూలీలసొమ్ము ఉపయోగించడం న్యాయమని, ఎక్కడైనా వుందీ!" అన్నాడు సిజావ్.

"బాగా ఆలోచించు. వెనుక మూడేళ్ళ క్రిందట ఫ్యాక్టరీవాళ్ళు కూలీల కోసం స్నానాలగదులు కట్టిస్తామని చెప్పి యిల్లాగే కూలి మినహాయించి చందా వేశారు. చందాయేమిటికీ పన్నే. దాదాపు 3809 రూబుల్సు వసూలు చేశారు. నాటికీ నేటికీ స్నానాలగదులు లేనేలేవు సరిగదా, ఆసొమ్ము యేమయిందో అతీగతీలేదు" అన్నాడు మకోటిన్."

♦ ఇది రష్యాదేశంలో ఒక చిన్ననాణెము. మన 'మొక' దమ్మిడిగ యెంచవచ్చు.

పావెల్ ఒక్క క్షణం ఆలోచించాడు. ఈ వసూలు చాలా దురన్యాయం అని నిర్ధారణ చేశాడు. ఫ్యాక్టరీ మేనేజరు లాభం తీయడానికి యెత్తిన యెత్తని స్పష్టంగా తెలియ చెప్పాడు. వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు.

గ్రామంలో వుండే పెద్దపెద్దలంతా కూడా తనకొడుకుదగ్గరకొచ్చి సలహాలేస్తూండడం జూచి తల్లి అపరిమితానందం పొందింది. ఆ సంతోషం పట్టలేక కొడుకుదగ్గరకొచ్చి "ఏమిరా నాయనా! యింత పెద్దవాళ్ళకికూడా నీ సలహాయే కావలిసొచ్చిందా?" అని అడిగింది. పావెల్ మాటాడకుండా బల్లదగ్గర కూచుని తలవంచి గబగబా ఏమిటో వ్రాసుకుంటున్నాడు.

వ్రాత ముగిసిన తర్వాత తల్లిని పిలిచి "అమ్మా! ఈ కాగితాలు పట్టుకెళ్ళి పట్టణంలో ఫలానాచోట ఇచ్చి రద్దూ" అని ప్రార్థించాడు.

"ఇందులో ఏమైనా ప్రమాదం ఉందా!"

"ఆ? ఉంది మనవాళ్ళకోసం అక్కడొక వార్తాపత్రికను ప్రకటిస్తున్నాము. వచ్చేవారం పత్రికలో మన ఫ్యాక్టరీ పన్నునుగురించిన కథ అచ్చుపడాలి."

"అయితే వెంటనే వెడతాను" అని చెప్పి వెంటనే మంచిబట్టలు కట్టుకుని ప్రయాణమైంది. తన కొడుకే తన కిలాంటిపని పురమాయించడం ఇదే మొదటిసారి అవడంచేతనూ, తానుకూడా అతని కేదో కాస్తసాయం చేయగలననే సంతుష్టివల్లనూ చాలా సంతోషపడింది. వీధి గుమ్మంలో కెడుతూ "పాషా! ఈ దొంగతనం అంతా నాకు తెలిసిందిలే! ఆ పేరేమిటి? ఈగర్ ఇవానిచ్‌కు కదూ ఇవ్వడం?" అని పాషాను రెట్టించి అడిగింది. అవునన్నాడు.

   

కాగితాలు యిచ్చి రాత్రి ప్రొద్దుపోయాక తల్లి యింటికొచ్చింది. చాలా శ్రమ పడింది. కాని చాలా తృప్తిపడింది.

"పాషా! అక్కడ శశాంక కనపడింది సుమా. ఆమె నిన్ను మరీ మరీ అడిగింది. ఈగర్ ఇవానిచ్ మహామంచివాడు. ఏమీ ఆర్భాటంలేని మనిషి. మహా వేళాకోళంగా మాట్లాడుతాడు. శుద్ధ హాస్యగాడు" అన్నది.

"నయమే! వాళ్ళంతా నీకు నచ్చినందుకు నాకు సంతోషమే"

"పాపా! వాళ్ళు ఏమాత్రం అట్టహాసం ఎరుగని మనుష్యులు సుమా. అట్లాంటివాళ్ళు చాలా మంచివాళ్ళు. వాళ్ళందరికీ కూడా నువ్వంటే చాలా గౌరవమే" అని తల్లి సంతోషంతో చెప్పింది.

♦ ♦ ♦ ♦ ♦

సోమవారంనాడు కూడా పావెలు పనిలోకి వెళ్ళలేదు. తలనొప్పిచేత బాధపడ్డాడు. మధ్యాహ్నం భోంచేసే వేళ ఫెడ్యామాజిన్ ఫ్యాక్టరీనుండి వురుకులేసుకుంటూ వచ్చేడు.

"లే! లే! ఫ్యాక్టరీఅంతా తిరుగబడింది. వాళ్ళంతా నిన్ను తీసుకు రమ్మనమని పంపేరు. సిజొవ్, మకోటిన్ ఇద్దరూకూడా నువ్వు వస్తే బాగా నచ్చచెపుతా వంటున్నారు. అబ్బ! యేమి గలాటా! పద, పద" అని ఒగుర్చుకుంటూ చెప్పాడు.

పావెల్ వెళ్ళడానికి సిద్ధమవుతూవున్నాడు. "ఆడవాళ్లు పెద్ద గుంపుగా చేరారు. వాళ్ళు మహా అరుస్తున్నారు" అన్నాడు ఫెడ్యా. "అబ్బాయీ, నీ వంట్లో బాగాలేదు. అక్కడున్నవాళ్ళు ఏం చేస్తున్నారు? నీతో నేనుకూడా వస్తాను పద" అంది తల్లి. పావెల్ రమ్మనమన్నాడు.

ముగ్గురూ గబగబా అడుగులేసుకుంటూ ఫ్యాక్టరీదగ్గరకు వెళ్లేరు. గుమ్మం దగ్గిర ఆడకూలీలు గుంపులుగా చేరి కాచుకొని గోలపెడుతున్నారు. ఈ ముగ్గురుకూడా గుంపులో పడ్డారు. ఒకమూలగా గోడదగ్గర సిజొవ్, మకో టిన్ వైలొవ్, మొదలైన అయిదారుగురు పెద్దమనుష్యులు ఇనుపకమ్ముల కట్టమీద నిలబడ్డారు. కూలీలంతా వాళ్ళచుట్టూచేరారు. నాయకుల పని వాళ్లనందరినీ కూచోమని చేతులు వూపుతూ అరుస్తున్నారు. ఇంతలో "అడుగో పావెల్" అన్నారు ఎవరో. ఇక్కడికి రమ్మనమనండి అన్నే కేక బయలుదేరింది. పావెల్‌ను ముందుకు త్రోశారు. తల్లి వెనకాల ఆగబడిపోయింది.

"కేకలు వెయ్యకండి. నిశ్శబ్దం" అని నాలుగువైపులనుండీ ధ్వనులు బయలుదేరినాయి.

రైబిన్ మాట్లాడుతున్నాడు.

"సోదరులారా! ఒక కోపెక్ కోసం కాదు మన పట్టుదల, న్యాయం కోసం. న్యాయం కోసం మనమంతా కట్టుకట్టాలి. మన కోపెక్ మేనేజరు ♦ రూబులుకన్న విలువైనది. ఎందుచేతనంటే మనం చెమటోడ్చి రక్తం ధార పోసి దీనిని సంపాదిస్తున్నాం. మేనేజరు వెండినాణెములకన్నా మన ఈ రాగి నాణెంలో మానవరక్త మెక్కువ యిమిడివుంది. ఈ కోపెక్ కన్న మనకు ప్రియమైన వస్తువు ఇంకొకటి ఉంది. అదే సత్యం. దానికొరకే మన పట్టుదల."

ఈ మాటలు ప్రజలలో అపరిమితమైన ఉద్రేకం కలుగజేశాయి. బలే అంటే బలే అన్నారు. ఆవేశం తాండవమాడుతుంది. పావెల్ పిజావ్ మకోటిన్ మొదలైన పెద్ద పెద్ద నాయకులంతా వున్నచోటికి చేరాడు. తల్లికూడా నెమ్మదిగా జనాన్ని గెంటుకొని కొడుకు దగ్గరగా జేరింది.

పావెల్ ఒక్కసారి జనాన్నంతటినీ కలియ చూశాడు. అతని దేహం పొంగింది. ఇనుపకమ్ముల వేదికపై కెక్కాడు. తనశక్తి చూపించవలసిన సమయం వచ్చిందిగదాయని సంతోషపడ్డాడు. అతిఉత్సాహంగా "సోదరులారా!" అని గర్జించాడు. ఆమాట వినేసరికి జనంలో నిశ్శబ్దం అయిపోయింది. ఉపన్యాసం ప్రారంభించాడు.

"నాయనలారా, చర్చీలను ఫ్యాక్టరీలను నిర్మించేవాళ్ళం మనమే. సంకెళ్ళు చేసేదీ, నాణెముల నచ్చుగుద్దేదీ మనమే. పిల్లలాడుకునే ఆట వస్తువులు మొదలు ధనికులకు లక్షలులక్షలు సంపాదించిపెట్టే యంత్రాలవరకు తయారుచేసేది మనమే. మనుష్యులు పుట్టినప్పటినుంచి గిట్టేవరకు శుభాశుభాలకు కావలసిన చిన్న పెద్ద వస్తువులన్నీ మనచేతిమీద తయారు కావలసినవే. ప్రపంచాన్ని పోషించి రక్షించే జీవనశక్తి మనమే. (వినుడు, వినుడు అని కేకలు) ఎక్కడా ఎప్పుడూకూడా చాకిరికి ముందు మనమే. కాని అనుభవంలోమాత్రం ఆఖరువాళ్ళం. మనకోసం దేవులాడేవాళ్ళెవరు? మన క్షేమం కోరేవాళ్ళెవరు? మనలను మనుష్యులుగా గణించేవాళ్ళెవరు? నమ్మండి, నమ్మండి. ఎవ్వరూ లేరు."

♦ రష్యాలో వెండినాణెము. రూపాయి వంటిది.

లేరు లేరు అనే కేకలు లేచాయి. ప్రజలలో వేడెక్కుతున్నందుకు పావెల్ సంతోషించాడు. మరింతఉత్సాహపడ్డాడు. గొంతుక సర్దుకొని అందరికి అర్థమయ్యే సాధారణభాషలో ఉపన్యాసం సాగనిచ్చేడు.

"సోదరులారా! మనప్రాథమిక హక్కులకోసం పోరాడటానికి మనం దృఢనిశ్చయం చేసుకోవాలి. అందరూ ఒక్కకుటుంబంలోని సోద రులలాగు సంచరించాలి. అలాగున కాని మన జీవిత స్థితి బాగుపడదు. అందరికీ పరమావధియైన లక్ష్యముకొరకై ఐకమత్యమును పెంపొందించాలి.

"అసలు సంగతేమిటో చెప్పరాదూ" అని సభలోనుండి ఎవరో అరిచేరు.

"మధ్య మధ్య పానకంలో పుడకల్లా అడ్డురాకండి! నోరు ముయ్యండి" అనే కేకలు నాలుగు మూలల్నుంచీ లేచాయి. అందరూ పావెల్ ఏమి చెబుతాడో అని అతని ముఖంకేసి చూస్తున్నారు. "వీడెవడో సోషలిస్టులాగున్నాడే కాని తెలివితక్కువవాడుమాత్రం కాదు" అని ఎవరో ఒక్కమాట విసిరేశారు. "చాలా ధైర్యంగా మాటాడుతున్నాడు" అని ఒక కుంటికూలీ, మాటపారేసి చక్కాపోయాడు.

పావెల్ ఉపన్యాసం సాగనిచ్చేడు.

"కాబట్టి సోదరులారా! మనకూలివల్ల విలాసంగా జీవనంచేసే దురాశపరుల తంత్రాలను ఎదుర్చొటకు కట్టు కట్టవలసిన సమయంవచ్చింది. ఆత్మరక్షణకిదే తరుణం మనకి మనమే సాయపడాలి కాని ఇంకెవ్వరూ సాయపడేవారు లేరు. మన ప్రతికక్షులను అణగద్రొక్కాలంటే మనమంద రం ఒక్క సిద్ధాంతాన్నే అనుసరించాలి. అందరికీ ఒక్కటే, అంతా ఒక్క దానికే. ఇదే మన ధర్మం___" పావెల్ వేదిక దిగాడు.

"అతను చెప్పినదంతా నిజం. విన్నారా?" అని మకోటిన్ ఒక్క కేక పెట్టేడు.

"ఇంతకూ మనం మేనేజరును పిలిచి అడగాలి" అన్నాడు పావెల్.

మాట నోటంబడి రావటమే తరువాయిగా జనం అందుకున్నారు. 'మేనేజర్ మేనేజర్' అని కొందరు, 'పిలవండి మేనేజర్ని' అని కొందరు. 'అతన్ని సమాధానం చెప్పమనండి' అని మరికొందరు అరవడం ఆరంభిం

చారు. కొంతగడబిడఅయినతర్వాత మేనేజరును తీసుకొనిరావనికీ, అతనితో సంప్రదించడానికీ, ప్రతినిధుల నేర్పాటుచేయడానికీ నిశ్చయించుకొన్నారు.

ఈ స్థితి గతులలో తల్లి పావెల్‌ను చూసింది. నిన్న మొన్న కళ్ళు తెరచిన పావెల్ గడ్డాలు మీసాలు నెరిసిన పెద్దలతోటివాదయినందులకు సంతోషపరవశురాలైపోయింది.

ప్రతినిధుల ఎన్నిక ప్రారంభమైంది. ఎవరంటే ఎవరనుకున్నారు. చివరికి అనవలసిన రాద్ధాంత సిద్ధాంతాలన్నీ అయిన తర్వాత మేనేజరుతో మాట్లాడటానికి సిజావ్, రైబిన్, పావెల్ — ముగ్గుర్నీ ఎన్నుకున్నారు.

మేనేజరు కొరకు కబురు పంపుదామని అనుకునేసరికి అతనేవచ్చాడు. చేయెత్తు పొడుగు మనిషి. బారుగడ్డం. కోలగా ధుమధుమలాడేమొగంతోనే మేనేజరు గుంపుదగ్గర కొచ్చాడు. జనం దారి యిచ్చారు. యజమానులకు సహజమైన అహంకారాన్ని వెదజల్లుతూ ఠీవిగా మేనేజరు ముందుకు తోసుకొచ్చేడు. పూర్వపు అలవాటుకొద్దీ పనివాళ్ళు గౌరవసూచకంగా టోపీలు తీసి దణ్ణాలు పెట్టారు. అతడా వందనాలేమీ అందుకోకుండానే అలక్ష్యంగా చరచరా ముందుకు సాగేడు.

మేనేజరును చూసేటప్పటికి భయంచేత కొందరు, భక్తిచేత కొందరు జనం ఖంగారుపడ్డారు. మేనేజరు తల్లిమొఖంకేసి ఒక్కసారి తీవ్రంగా చూసి చక్కాపోయాడు. గబగబా యినుపకమ్ముల గట్టుమీదెక్కి యేమీ యెరుగనట్లు "ఏమిటిదంతాను? మీరంతా పనెందుకు మానేశారు?" అని అడిగాడు.

కొంచెంసేపు యెవ్వరూ మాట్లాడలేదు.

"మిమ్మల్నే అడుగుతుంట. మాట్లాడరేం?" అని గుడ్లెర్రచేసి మేనేజరు గర్జించాడు.

పావెల్ ముందుకొచ్చి సిజావు, రైబిన్‌లను చూపిస్తూ "ఇదగో మా ముగ్గురినీ మీ కోపెక్ మినహాయింపు ఆర్డరును రద్దుచేయించుటకు మీతో సంప్రదించడానికి ప్రతినిధులుగా సోదరులంతా యెన్నుకొన్నారు" అన్నాడు.

"ఎందుకూ?" అని మేనేజరు పావెల్‌కేసి కన్నయినాయెత్తకుండా అడిగేడు.

"ఎందుకా? మీరు విధించిన పన్ను అక్రమం కనుక" అని పావెల్ గట్టిగా చెప్పేడు.

"ఏమిటీ ? గుంటలో మురుగు లేకుండా చేయడానికి నేను చేసిన యేర్పాటు బాగా లేదూ ? కూలీలను దోచుకోడానికి వేసిన యెత్తు వేశానా ? కూలీల ఆరోగ్యం బాగు చెయ్యడమే నా అభిప్రాయమని గ్రహించలేరూ?"

"అదే మా అనుమానం, అనుమానమేమిటి? కాదనే మా నమ్మకం"

"ఏం రైబిన్? నీ అభిప్రాయమూ అంతేనా?"

"ఆ! అంతే"

"సిజొవ్ ! నువ్వేమంటావు ?"

"నేనూ అంతే అంటాను. మా పైసాలు మా కొదిలి పెడుదురూ ?" అని నవ్వుతో కాస్త రాజీగా సిజొవు జవాబు చెప్పాడు.

మేనేజరు ఒక్కసారిగా తలవంచి జనాన్ని పరిశీలనగా చూచాడు. తర్వాత పావెల్‌ను ఎగాదిగా చూచి "ఏం పావెల్! అందరిలోనూ కాస్త తెలివి తేటలు గలవాడివి నువ్వే. నా స్కీముయొక్క ప్రయోజనాన్ని నువ్వు కూడా గుర్తించలేదూ?" అని అడిగాడు.

"ఫ్యాక్టరీ సొమ్ము ఖర్చుపెట్టి పల్లం మెరక చేయిస్తే అప్పుడు సంతోషిస్తాం. మీ మంచి మాకప్పుడు తెలుస్తుంది." అన్నాడు పావెల్.

"ఫ్యాక్టరీ ధర్మసత్రం కాదు" అని మేనేజరు పుల్లవిరుపుగా చెప్పి, ఇక లాభంలేదనుకుని తీవ్రంగా "ఏయ్! మీరంతా వెంటనే పనిలోకి వెళ్ళండి. ఇదే నా ఆజ్ఞ. తెలిసిందా? వెడతారా? వెళ్ళరా?" అని హుంకరిస్తూ దిగొచ్చేశాడు.

ఒక్క క్షణం యెవ్వరూ మాటాడలేదు.

ఇంతలో జనంలోంచి యెవరో "నువ్వెళ్ళుదూ, నీ పనిలోకి" అని కేక వేశాడు. మేనేజరు మరింత ఉగ్రుడయిపోయాడు.

"ఇదిగో చూచుకోండి! పావుగంట టైమిస్తున్నాను. ఈలోగా మీరు పని ప్రారంభించకపోతే అందరినీ కూడా పనిలోనుంచి తప్పించేస్తాను" అని కుండ బద్దలుకొట్టినట్టుగా చెప్పి వెళ్ళిపోయాడు.

జనంలో గడబిడ బయలుదేరింది. "మేనేజరుతో మాటాడండి" అన్నాడొకడు.

"ఇంతేనయ్యా న్యాయం" అన్నాడింకొకడు. కొందరు పావెల్ కేసి తిరిగి "ఏమయ్యోయ్! నువ్వే మా వకీలువు. ఇక ముందేమి చెయ్యాలో చెప్పు. నీవు బాగానే చెప్పావు. కాని మేనేజరొచ్చేసరికి అంతా టెంకాయి పిచ్చికొండయిపోయింది.

"ఏమంటావు!" అని అడగడం ఆరంభించారు. కేకలు, బొబ్బలు, గందరగోళం హెచ్చిపోయింది. పావెల్ కొంచెం శాంతపరచి "సోదరులారా! మేనేజరు కోపెక్ ఉత్తరువు రద్దుచేసుకునేవరకూ మనం పనిలోనికి పోగూడదని నా సలహా" అని గంభీరంగా చెప్పేడు. జనంలో ఉద్రేకం మరీ హెచ్చిపోయింది. తలకొక మాట మాట్లాడారు.

"మనం శుద్ధ మూర్ఖులమని కాబోలు అతని ఉద్దేశం"
"ఏమయినాసరే, మనం జరిపించి తీరాలి"
"సమ్మెకట్టన్నమాట?"
"ఇంతపని ఒక్క కోపెక్ కోసమా!"
"ఎందుకు కాదు?"
"సమ్మె ఎందుకు కట్టకూడదు ?"
"మననందరినీ పనిలోంచి గెంటేస్తారా"
"ఈ పనెవడు చేస్తాడు"
"ఇంకా చేసేవాళ్ళు కావలసినంతమంది ఉన్నారు"
"ఎవ్వరు? ఒంటెత్తు నిర్భాగ్యులా? (Judases)"
"అయితే నేను సంవత్సరానికి 3 రూబుల్సు అరువదైయిదు కోపెక్‌లు దోమలకోసం ఇవ్వాలన్నమాట!"
"నువ్వన్నమాటేమిటి? అంతా యివ్వాలి"

ఈ మాటలన్నీ వింటూ పావెల్ క్రిందికి దిగొచ్చి తల్లికి సమీపంగా నిలబడ్డాడు. ఎవ్వరూకూడా అతనికేసి చూడడమేలేదు. అంతా జోరుగా అరుస్తూ చర్చచేస్తున్నారు.

రైబిన్ పావెల్ దగ్గరకొచ్చి "అబ్బే వీళ్ళచేత సమ్మెకట్టించటం అసంభవము. ఒక్కపైసాకి ఆశపడతారు. కాని పిరికిపందలు. మహాచేస్తే నీవెంటఉండే జనం మూడువందలమంది వుంటారేమో! అంతకుమించరు. ఒక్క సంగతి చెపుతాను విను. వీళ్ళంతా వట్టి చచ్చుదద్దమ్మలు" అంటూ నిరుత్సాహపరిచాడు.

